ప్రథమ ముద్రణ :
సంక్రాంతి, 1990
ప్రచురణ :

నవభారతి ప్రచురణలు
3-4-705/4, నారాయణగూడా
హైదరాబాదు-500 029.

ప్రతులకు :
సాహిత్య నికేతన్
బరకత్‌పురా
హైదరాబాదు-500 027.

సాహిత్య నికేతన్
కాశేశ్వరరావు రోడ్
గవర్నరు పేట
విజయవాడ-520 002.

ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడ, హైదరాబాదు-500 029

వెల : రూ. 2.50

# వెర్రితలలు వేస్తున్న 'సెక్యులరిజం'



రచన :

శ్రీమన్నవ గిరిధరరావు, Ex M.L.C.

నవభారతి ప్రచురణలు
హైదరాబాదు.

# ముందు మాట

'సెక్యులరిజం' అంటే ఏమిటి ? ఈ ప్రశ్న అనవసరమనిపించినా, తరచుగా పలువురు తమకు తోచిన రీతిలో ఈ పదాన్ని వాడటం వలన ఏర్పడిన గందరగోళ పరిస్థితిని గమనించిన తరువాత, అవసరమే అని పిస్తుంది. సెక్యులరిజాన్ని నాస్తికవాదంగా, మత రహిత రాజ్యంగా, మతానికి ప్రాముఖ్య మివ్వని రాజ్యంగా, అల్పసంఖ్యాక వర్గాల వారికి శ్రేయస్సును సమకూర్చే రాజ్యంగా - ఇలా ఎవరికి తోచిన అర్థం వారు చెప్తున్నారు. ఆచరణలో మరీ విపరీతంగా కనపడుతోంది.

కాని హిందువుల దృష్టిలో సర్వధర్మసమభావనే సెక్యులరిజం. ఆ భావన ప్రాచీనకాలం నుండి వ్యక్తమౌతూనే ఉంది. మళ్ళీ మళ్ళీ హిందువులకు ఆ విషయం చెప్పవలసిన పనిలేదు. 'ఏకంసత్ విప్రాః బహుధా వదన్తి' అని ఋగ్వేదం చెప్పింది. ఈ విషయాలను స్పష్టీకరిస్తూ చిన్న పుస్తకాన్ని వ్రాయమని కోరగానే శ్రీమన్నవ గిరిధరరావు గారు మా మాటను మన్నించి, ఈ పుస్తకాన్ని ప్రచురణార్థమై మాకందించారు. వారికి మా కృతజ్ఞతాపూర్వక నమస్కారాలు.

ఈ పుస్తకాన్ని సత్యాన్వేషకులైన పాఠకులు ఆదరించగలరని మా నమ్మకం.

మకరసంక్రాంతి
పుష్యబహుళ తదియ
జనవరి 14, 1990
హైదరాబాదు

ప్రకాశకులు

ACC NO 5347

1987 నవంబరులో గోవాలో జరిగిన అఖిల భారత చరిత్ర కాంగ్రెస్ సభలలో ప్రధాన కార్యదర్శి డా॥ డి. ఎన్. ఝూ ప్రసంగిస్తూ దూరదర్శన్‌లో వారం వారం రామాయణ గాధను ప్రసారం చేయడాన్ని నిశితంగా విమర్శించారు. అలా ప్రసారం చేయడం భారత ప్రభుత్వం అనుసరించే సెక్యులరిజానికి పూర్తిగా విరుద్ధమని ప్రకటించారు.

దూరదర్శన్‌లో రామాయణమేగాక అనేక హిందూ దేవాలయాలలో జరిగే ఉత్సవాలను, దైవ ప్రార్థనలను గూడ ప్రసారం చేస్తున్నారు. భద్రాద్రిలో జరిగే శ్రీ సీతారామ కళ్యాణోత్సవాన్ని, తిరుపతిలో శ్రీ వేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవాలను, శ్రీశైలంలో మహాశివరాత్రి ఉత్సవాలను టెలివిజన్‌లో చూపుతున్నారు. శ్రీ ఎం. ఎస్. రామారావుగారు గానం చేసిన సుందరకాండను, భక్త రామదాసు గారి కీర్తనలను ఎన్నిటినో అనుదినం రేడియోలో ప్రసారం చేస్తున్నారు మరి ఇవన్నీ సెక్యులరిజానికి వ్యతిరేకమంటూ డా॥ ఝూ లాంటివారు అభ్యంతరాలు తెలుపుతారా?

అసలు అనాదినుండీ ఈ దేశంలో నివసిస్తూ ఈ దేశంయొక్క కష్టసుఖాలలో పాలుపంచుకొంటున్నవారు హిందువులు. ఈ దేశం పేరు హిందూదేశం లేక భారత వర్షం. ఈ నేలమీద ప్రతి అణువూ హైందవ దేవతలతోటీ దేవాలయాలతోటీ పెనవేసుకొని ఉన్నది. చరిత్రకందని కాలంనుంచి ఈనాటివరకూ ఎవరూ రామాయణాన్ని ఈ గడ్డమీద ప్రదర్శించరాదనీ, ప్రసారం చెయ్యరాదనీ కుతర్కాలు లేవదీసినవారు లేరు.

ఇపుడు అలా ప్రసారం చేయడం "సెక్యులరిజా"నికి వ్యతిరేకమంటూ ఒకరు బహిరంగ ప్రకటన చేశారు. ఏమిటి ఆయన పాపం? అసలతడు ఇచటి ప్రజా హృదయాన్ని అర్థం చేసుకున్నాడా? ఈ జాతియొక్క నాడి ఏమిటో ఆయన గ్రహించాడా?

## జాతి యొక్క హృదయ స్పందన రామాయణం :

కోటానుకోట్ల భారతీయులు దూరదర్శన్‌లో రామాయణ గాథను చూచి పులకితులైనారు. మిగతా పనులు మానుకొని ఆ కార్యక్రమం కొరకు ఎదురు తెన్నులు చూశారు.

ఈనాడు సర్వత్రా అధికారం కొరకు కుమ్ములాటలు, అక్రమాలు, అఘాయిత్యాలు ఎన్నో జరుగుతూ వున్నాయి.స్వప్రయోజనాలకొరకు గాక విధినిర్వహణ భావంతో పదవిని చేపట్టేవారు ఒక్కరూ లేరు. అలాంటపుడు "నేను కాదు, నీవే రాజ్యపాలన చేపట్టు" అని శ్రీరాముడు భరతుడు ఒకరితో నొకరు తగాదాపడి సటువంటి, హృదయాలను కదిలించి వేసేటువంటి, సంఘటన రామాయణంలో వున్నది. అట్టి సన్నివేశం ప్రపంచ సాహిత్యంలో మరెక్కడాకానరాదు. ఈ ఒక్క సన్నివేశాన్ని మననం చేసుకున్నా దేశనాయకులు బాగుపడతారు. అలాంటి రామాయణాన్ని దూరదర్శన్‌లో చూపడం "సెక్యులరిజానికి వ్యతిరేక "మని ఆరోపిస్తున్నాడు డా॥ ఝా. అంతేగాదు. యావత్తు రామాయణగాథ ఏ దేశంలో జరిగిందో ఏ దేశంలో దాన్ని వినడాన్ని ప్రజలు అమృత తుల్యంగా భావిస్తారో, ఆ దేశంలోనే దీనికి అభ్యంతరం తెలుపు తున్నారు అందులోనూ అఖిల భారత చరిత్ర కాంగ్రెస్ కార్యదర్శి అంటే మామూలు వ్యక్తికాదు. ఇట్టి భావమే మరికొందరి మనస్సులలో వుండి వుండవచ్చు.

అందుచేత 'సెక్యులరిజం' అంటే ఏమిటి? దానిని ఐరోపాలో ఏ అర్థంలో వాడారు? ముస్లిం దేశాలలో పరిస్థితి ఎలావున్నది? మన దేశంలో ఈ పదాన్ని ఏ అర్థంలో వాడుతున్నారు? అనే విషయాలను సాకల్యంగా పరిశీలిద్దాం.

## సెక్యూలరిజం అంటే ఏమిటి?

'సెక్యులర్' అనగా ప్రాపంచికమైన, లౌకికమైన అని అర్థం. ఆంగ్ల నిఘంటువులో Secular అనగా Worldly or material అని చెప్ప బడింది. ఇది ఐరోపానుండి మనం గ్రహించిన భావన. అందుకే సెక్యులర్ అనే ఆంగ్లపదాన్ని యథాతథంగా మనం వాడుతున్నాం. భారతదేశం సంగతి దూరంగా వుంచి మొదట ఐరోపాలో ఈభావన ఎప్పుడు ఎందుకు ఎలా రూపొందిందో పరిశీలిద్దాం.

ఐరోపాలో క్రైస్తవ మతం వ్యాపించినది మొదలు క్రీ. శ. 1870 వరకు అనగా రమారమి వెయ్యి సంవత్సరాలపాటు రాజకీయరంగం మీద క్రైస్తవ మతాధిపతియగు పోప్ యొక్క ఆధిపత్యం అత్యధికంగా వుండేది. పోప్ క్రైస్తవ మతాధిపతిగా వుంటూనే ఇటలీలో ప్యాపల్ స్టేట్స్ (Papal States) అనే రాజ్యాలకు రాజుగా గూడ వుండేవాడు. అన్ని దేశాలలో చర్చి అధికారులను తానే నియమించేవాడు. రాజుల వివాహాలకు, పట్టాభిషేకాలకు పోప్ అనుమతి వుండాలి. పాలస్తీనాలోని క్రైస్తవ పుణ్యక్షేత్రాలను క్రిస్టియన్‌లు సందర్శించడానికి మహమ్మదీయులు ఆటంకపరచు చున్నందున 1095 లో ముస్లిములపై మత యుద్ధాలు (Crusades) చేయవలసినదిగా ఐరోపాలోని క్రైస్తవరాజు లందరికీ పోప్ ఆదేశాలు జారీచేశాడు తదనుగుణంగా ఇంగ్లండు, జర్మనీ, ఫ్రాన్సు లకు చెందిన క్రైస్తవ రాజులు పాలస్తీనాలోని పవిత్ర స్థలాలకోసం తురుష్కులతో నాలుగు మతయుద్ధాలు చేశారు.

ఐతే కొంత కాలానికి ఐరోపా రాజులు తమ దేశాలమీద పోప్ యాజమాన్యాన్ని ప్రతిఘటించవలసిన అగత్యం కలిగింది. 1529 లో ఇంగ్లండు రాజకు ఎనిమిదవ హెన్రీ తన భార్య క్యాథరీన్‌కు విడాకులివ్వ దలచగా అందుకు పోప్ అనుమతించలేదు. అందుచేత పోప్ ఆధిపత్యాన్ని హెన్రీ ఎదిరించాడు. తన దేశంలో చర్చి అధికారులను తానే నియమించ నారంభించాడు.

ప్రతి దేశంలో రమారమి మూడవవంతు భూమి చర్చి యాజమాన్యంలో వుండేది. దానిమీద రాజు పన్నులు వేయగూడదు. అంతేగాక చర్చి అధికారులు ప్రజలనుండి 'టైట్' (Titue) అనే పన్ను వసూలు చేసేవారు. అది ప్రజల వ్యావసాయిక ఆదాయంలో పదవవంతు వుండేది. ఆర్థికంగాగూడ చర్చి బలవత్తరంగా వుండేది. క్రైస్తవ మతాచార్యులు రాజులను తమ చెప్పుచేతల్లో పెట్టుకొనేవారు. అందుచేత 1500 సంవత్సరం తరువాత చర్చి అధిపత్యాన్ని రాజులు ఎదిరించి దానినుండి స్వేచ్ఛను పొందడం కొరకు ప్రయత్నించారు; అనేక రకాలుగా పోరాడారు. 1789 లో ఫ్రాన్సులో విప్లవం వచ్చింది. విప్లవకారులు రాజుకు వ్యతిరేకంగానే కాక చర్చికి వ్యతిరేకంగాగూడ తిరుగుబాటుచేశారు. మత ప్రమేయం లేని 'సెక్యులర్' రాజ్యస్థాపనకై కృషి చేశారు. అలాగే జర్మనీలో బిస్మార్క్ తన దేశపు మత విషయాలలో పోప్‌యొక్క ఆధిపత్యం తొలగించడం కొరకు పోరాడాడు. క్రమంగా ఐరోపాలోని అనేక క్రైస్తవ రాజ్యాలపై పోప్‌యొక్క జోక్యం అంతరించింది. ఐనప్పటికీ 1870 వరకు ఇటలీలో పోప్ స్వయంగా మధ్య ఇటలీ రాజ్యాలకు పాలకుడుగా కొనసాగాడు.

మతాధిపతి యొక్క జోక్యం లేకుండా రాజ్యం లౌకికంగా వుండాలని, మతాన్ని రాజకీయాల నుండి విడతీయాలనీ ఇటలీ రాజనీతి వేత్త మెకియవెల్లీ 1520లో 'ప్రిన్స్' అనే గ్రంథంలో ప్రతిపాదించాడు. దీనికే సెక్యూలరిజం అనే పేరు వచ్చింది. ఆంగ్ల రాజనీతి వేత్త థామస్ హాబ్స్ దీనిని సమర్థించాడు.

## సెక్యూలర్ రాజ్యం మతరహిత రాజ్యం కాదు :

సెక్యూలర్ రాజ్యం మతాధికారి ఆధిపత్యం లేని రాజ్యమే గాని మతము లేని రాజ్యం కాదు. మతము, రాజకీయాలు విడివిడిగా వుంటాయే గాని మతము నిషేధించబడదు; నిర్మూలింపబడదు. పరిపాలకులు, ప్రజలు గూడ తమ కిష్టమైన మతాన్ని అనుసరిస్తారు.

బ్రిటన్‌లో ఎగువ సభయగు ప్రభువుల సభకు (House of Lords) 26 మంది క్రైస్తవ మతాధికారులను రాజు సభ్యులుగా నియమిస్తాడు. బ్రిటిష్ రాజు యొక్క పట్టాభిషేకాన్ని దేశం యొక్క అత్యున్నత మతాధికారి (Archibishop of Canterbury) నిర్వహిస్తాడు. జర్మనీలో ఇపుడు పరిపాలిస్తున్న రాజకీయ పార్టీ పేరు "క్రిస్టియన్ డెమాక్రటిక్ పార్టీ". పార్టీ పేరులోనే 'క్రిస్టియన్' అనే పదం వున్నది. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ప్రజలు, నాయకులుగూడ దైవ విశ్వాసం కలిగి యుంటారు. నాయకులు గూడ చర్చిలో ప్రార్థనలు చేస్తారు. అంతేగాదు, ఆ దేశంలో సెంటు నాణెం మీద "IN GOD WE TRUST" (దేవునిలో మేము విశ్వాసముంచాము) అని ముద్రించబడి వుంటుంది. అలా ప్రకటించడాన్ని వారెవరూ 'మతోన్మాదం' గా భావించరు. మానవుని నైతిక ప్రవర్తనకు దైవ విశ్వాసం అవసరమని భావిస్తారు.

అందుచేత పశ్చిమ దేశాల వారి దృష్టిలో సెక్యులరిజం అంటే మత రాహిత్యం కాదు. రాజకీయాలు మతం నుంచి విడదీయబడడం మాత్రమే.

## మహమ్మదీయ రాజ్యాల లక్షణం :

మహమ్మదీయ రాజ్యాల పరిస్థితి మరొక విధంగా వున్నది.

మహమ్మద్ ప్రవక్త క్రీ. శ. 622లో మక్కా నుండి మదీనాకు పారిపోయి అచట ఇస్లాం మతాన్ని స్థాపించాడు ఇస్లాం మతాధిపతిగానే గాక మదీనాకు పరిపాలకుడుగా గూడ వున్నాడు. తద్వారా మతముతో రాజ్య వ్యవస్థను మిళితం చేశాడు. ఆయన తరువాత వచ్చిన ఖలీఫాలు ఇస్లాం మతాధిపతులుగను రాజ్యాధిపతులుగా గూడ కొనసాగారు. దేశ దేశాలలోని మహమ్మదీయ రాజులు ఖలీఫా యొక్క ప్రతినిధులుగా మాత్రమే సింహాసనాలను అధిష్ఠించారు. ఆయా దేశాలలోని ఉలేమాల ఆజ్ఞలను అనుసరిస్తూ సుల్తానులు పరిపాలించారు. అందుచేత మహమ్మదీయ రాజ్యాలన్నీ మతరాజ్యాలు (Theocratic States) గనే వున్నాయి. భారతదేశంలో ఢిల్లీ సుల్తానులు, మొగల్ చక్రవర్తులు గూడ మహమ్మదీయ మతాధికారులగు 'ఉలేమాల' ఆధిపత్యానికి తలవంచి రాజ్య పాలన చేశారు. టర్కీలో వున్న ఖలీఫాకు ప్రతినిధులుగా కొనసాగారు

1918లో మొదటి ప్రపంచ యుద్ధంలో టర్కీ ఓడిపోయిన పిదప ఖలీఫా పదవి రద్దుచేయబడినది. ముస్లిం రాజ్యాలపై టర్కీ యొక్క యాజమాన్యం అంతరించింది. అయినప్పటికీ ఏ దేశానికాదేశంలో ముస్లిం మతాధికారుల ప్రమేయం, జోక్యం ముస్లిం దేశాలలో కొనసాగుతూనే వున్నది. అందుచేత ముస్లిం రాజ్యాలన్నీ ఇప్పటికీ మతరాజ్యాలే గాని సెక్యులర్ రాజ్యాలు కావు. పాకిస్తాన్ యొక్క పూర్తి పేరు "ఇస్లామిక్ రిపబ్లిక్ ఆఫ్ పాకిస్తాన్".

## భారతదేశంలో పరిస్థితి :

భారతదేశంలో మతాధిపతియే రాజ్యాధిపతిగా ఎన్నడూ వుండలేదు. శంకరాచార్యులు, రామానుజాచార్యులు, మధ్వాచార్యులు మున్నగువారు గాని, వేదకాలము నాటి మహర్షులు గాని సింహాసనముల నధిష్టించలేదు. రాజుల మీద ఆధిపత్యం చలాయించాలనే కాంక్ష గూడ వారికి లేదు. మనస్సును అంతర్ముఖం చేయడం ద్వారా సమాధిస్థితి పొంది, మానవాళి శ్రేయస్సునకుపకరించే శాశ్వత సత్యాలను గ్రహించి వాటిని ప్రజలకుపదేశించారు. ప్రజా జీవితం సుఖశాంతులతో వర్ధిల్లే మార్గాలను వారు అన్వేషించారు. వారు రాజ ప్రాసాదాలకు దూరంగా పర్ణకుటీరాలలో నివసించారు. తమ బోధనల వ్యాప్తికి గూడ రాజులను ఆశ్రయించలేదు.

రాజుకు ధర్మమార్గాన్ని సూచించడానికి పురోహితుడుండేవాడు. రాజు అతని సలహాలను పాటించి తీరవలెనను నిర్బంధములేదు. పురోహితుడు ఒక సలహా దారుడు మాత్రమే.

ఐరోపాలోవలె భారతదేశంలో మతాచార్యులు రాజుల మీద ఆధిపత్యం చలాయించడానికీ, రాజశక్తికి పోటీగా ధనబలంతో గూడిన మతశక్తిని నిర్మాణం చేయడానికి ప్రయత్నించలేదు. అందుచేత ఐరోపాలోవలె మతాధికారులపై పోరాటం జరిపి వారినుండి స్వేచ్ఛను పొందవలసిన అగత్యం ఇక్కడి రాజులకు కలుగలేదు. ఖలీఫాలవలె మతాధిపతియే రాజ్యాధిపతిగా గూడ వుండడమనేది ఇక్కడ ఎన్నడూ జరగనందున భారతదేశంలో మతరాజ్యాన్ని హిందువులు ఏర్పరచలేదు. (ఇక్కడకు దండెత్తి వచ్చిన మహమ్మదీయ సుల్తానులు మాత్రమే మత రాజ్యాలను (Theocratic States) ఏర్పరచారు.

హిందువుల రాజ్యం ఆదినుంచీ మతాధిపతియొక్క జోక్యం లేని రాజ్యమే. పాశ్చాత్యుల పరిభాషలో దీనిని 'సెక్యులర్' రాజ్యమనవచ్చు. ఐతే ఇది మతరహిత రాజ్యం ఎన్నడూ కాదు. ప్రజలూ పాలకులూగూడ ధర్మానికి లొంగివుండాలి. ధర్మానికి అగ్రస్థానమివ్వాలి.

## మానవులకు మతంయొక్క ఆవశ్యకత :

రాజ్యాలు మతాతీతంగా ఉంటాయి. అంటే అర్థం ఎవరియెడల మతాన్నిబట్టి వివక్షత చూపవు. (No discrimination on the basis of religion) సర్వమత సమభావన కలిగి యుంటాయి.

కాని వ్యక్తులుగాని, సమాజంగాని మతరహితంగా వుండవు. ఎందువల్లనంటే, బైబిలులో చెప్పినట్లు "మానవుడు రొట్టెవలన మాత్రమే జీవించడు. అతడు దివ్యశక్తిపై నమ్మకమువలన జీవిస్తాడు,"

"భగవంతుడు సర్వత్రా వ్యాపించి యున్నాడనే సత్యాన్ని గుర్తించడం అవసరం. మనం చేసే పాపకార్యాలన్నీ ఎవరూ చూడనప్పుడు చేస్తుంటాం. కాని అపుడు సహితం భగవంతుడు చూస్తూనే వున్నాడని, మనం చేసే పనులనేగాక మన ఆలోచనలను గూడ చూస్తున్నాడనే సత్యాన్ని గ్రహించినపుడు మనం పాపాల నుండి విముక్తుల మవుతాం" అని గాంధీ మహాత్ము డన్నాడు.

అందుకే ఫ్రెంచిరాజనీతివేత్త వోల్టేర్ "భగవంతుడనే వాడు నలేట్లయితే, అట్టివాణ్ణి కనిపెట్టవలసిన ఆవశ్యకత వున్నది" అని అన్నాడు ("If God did not exist, it would be necessary to invent him" - Voltair)

కారల్ మార్క్స్ "మతము మత్తుమందు" అని అభిప్రాయపడినంత మాత్రాన లోకంలో మతములయొక్క ఆవశ్యకత లేకుండా పోలేదు. ఇటీవల చైనా కమ్యూనిస్టు నాయకులు "మనుష్యుల ప్రవర్తననూ బాగు పరచే శక్తిమతానికి వున్నది" అని ప్రకటించారు. రష్యాలో శ్రీకృష్ణభక్తి వ్యాప్తికి అధికారులు అనుమతించారు. కీవ్, లెనిన్‌గ్రాడ్, రీగా మొదలైన 15 పట్టణాలలో హరేకృష్ణ కేంద్రాలు నడుస్తున్నాయి. పిన్నవయసులోనే త్రాగుడు, వ్యభిచారములకు యువకులు అలవాటుపడకుండా వారికి సత్ప్రవర్తన అలవర్చడానికి హరేకృష్ణ ఉద్యమం తోడ్పడగలదని రష్యావారు భావిస్తున్నారు.



## భారతీయుల స్ఫూర్తికేంద్రాలు :

అలాగే భారతదేశంలో ప్రజలు రామాయణం నుండి, భగవద్గీత నుండి, భారత భాగవతాలనుండి ఉత్సాహం పొందుతున్నారు.

శ్రీమతి ఇందిరాగాంధీ తన కుమారునికి భారతంలో విశిష్ట పాత్ర యగు సంజయుని పేరు పెట్టుకున్నది ఒక విదేశ పత్రికా విలేఖరి ఆమెతో ఇంటర్వ్యూ చేస్తూ "మీకు చారిత్రక పురుషులలో ఎవరంటే ఎక్కువ అభిమానం? అని అడుగగా "ఆదిశంకరులు" అని జవాబు చెప్పింది.

జీవితంలో కొన్ని క్లిష్ట సమయాలు వస్తాయి. వాటిని కేవలం పురుష ప్రయత్నంతో అధిగమించజాలమని అనిపిస్తుంది. అపుడు మానవుడు దైవ శక్తియొక్క కరుణను పొందగోరుతాడు.

బంగ్లాదేశ్ సమస్యను ఎదుర్కోవలసి వచ్చినపుడు శ్రీమతి ఇందిరా గాంధి జమ్మూ సమీపంలోని వైష్ణవీదేవి మందిరంలో నిష్ఠతో అర్చనలు చేసింది. నేటి ఉపరాష్ట్రపతి శ్రీ శంకర్‌దయాళ్ శర్మ తిరుపతి శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయంలో బ్రహ్మీ ముహూర్తంలో పొర్లు దండాలతో ప్రదక్షిణలు చేశాడు.

నేతాజీ సుభాస్ చంద్రబోస్ వివేకానందుడే తనకు స్ఫూర్తిప్రదాత అని ప్రకటించాడు. అరవింద ఘోష్ భారతమాతను జగన్మాతయొక్క రూపంగా భావన చేసి అర్చించాడు.

విప్లవవీరుడు బాలముకుంద్ భగవద్గీతను చేతపట్టుకొని ఉరికంబ మెక్కాడు. బాలగంగాధరతిలక్, వినోబాభావేలు భగవద్గీత నుండి ప్రేరణ పొందారు. మహాత్మాగాంధి రామాయణంలో గ్రుడ్డివారగు జననీజనకులను కావడిలో కూర్చోబెట్టుకొని తీర్థయాత్రలకు గొనిపోతున్న శ్రావణకుమారుని నుండి ఉత్సాహం పొందాడు.

కోటాను కోట్ల హిందువులు అనుదినం సుందరాకాండను గాని, గజేంద్ర మోక్షమునుగాని, భగవద్గీతనుగాని పారాయణచేసి మనశ్శాంతిని, ఆత్మవిశ్వాసాన్ని పొందుతూ వుంటారు. వివాహ సమయంలో తెలుగువారు "సీతమ్మ పెళ్ళికూతురాయెనే" అనే పాట వింటూ పరమానందంతో ఆనంద బాష్పాలు రాలుస్తారు. "రామా నీ మాటే మాట, రామా నీ పాటే పాట" అని త్యాగయ్యగారి పాట వింటూ తన్మయులవుతారు. "జో అచ్యుతానంద జోజో ముకుందా" అని కన్నయ్యను జోకొడుతూ అంగనలు పాడే జోల పాట ఇంటింటా వినిపిస్తుంది.

ఇలాంటి రామాయణాన్ని దూరదర్శన్‌లో ప్రసారం చేస్తే అది సెక్యులరిజానికి వ్యతిరేకమవుతుందనేవారు ఎందరో దేశ నాయకుల యొక్క, ప్రజల యొక్క హృదయాలను ములుకులతో పొడుస్తున్నారు జాతి హృదయాన్ని కత్తితో కోస్తున్నారు. శ్రీరాముని దేశంలోనే రామ కథను దూరదర్శన్‌లో చూచి ఆనందించే హక్కు ప్రజలకు లేదా? ఇవ్వాళ రామాయణాన్ని వద్దన్నవాళ్ళు రేపు భగవద్గీతను, ఆ తర్వాత భాగవతాన్ని వద్దంటారు. రామున్నీ, కృష్ణున్నీ, శంకరుణ్ణీ తీసివేస్తే నీకు

దేశంలో సంగీతం మిగులుతుందా, సాహిత్యం మిగులుతుందా, శిల్పం మిగులుతుందా, చిత్రకళ మిగులుతుందా? ఏది మిగులుతుంది? ప్రతి హిందువుడూ తీవ్రంగా ఆలోచించవలసిన పరిస్థితి యిది.

సెక్యులరిజానికి ఇవ్వవలసిన అర్థం ఇవ్వకుండా మతరహితమనే అర్థం యిచ్చి, అదిగూడ హిందూమతానికి మాత్రమే అన్వయించి ప్రజలను తప్పుత్రోవలు పట్టించడం జరుగుతూ వున్నది.

సెక్యులరిజమంటే మతరాహిత్యం కాదు. సెక్యులరిజమంటే మతమును బట్టి వివక్షత చూపకపోవడం. ఏ మతస్థులకైనా వారి వారి మతాలను అనుసరించే స్వేచ్ఛ ఉండడం. ప్రభుత్వం మీద మతాధికారుల పెత్తనం వుండకపోవడం. రాజకీయాలు మతముతో పెనవేసుకొనకుండ విడిగా వుండడం. అంతేగాని ప్రజలు పరిపాలకులు ధర్మాన్ని విసర్జించడం కాదు. నీతి బాహ్యత కానేకాదు.

అసలు ఈ కుహనా సెక్యులర్ వాదులు (Psudo Secularits) నిజంగా భారతదేశం సెక్యులర్ రాజ్యంగా కొనసాగాలని మనస్ఫూర్తిగా కోరుతున్నారా? అలా వారు నిజంగా కోరుతున్నట్లయితే ఈ దేశంలో సెక్యులర్ భావనకు పునాదులేమిటో అర్థం చేసుకోవాలి. సత్యాలను గ్రహించాలి.

## దేశంలో సెక్యులర్ భావనకు పునాదులు ఏమిటి?

స్వతంత్రం వచ్చే వరకు యావద్భారత దేశంలో సర్వమత సమభావనలో మత వివక్షత లేకుండా పరిపాలన నడిచింది. దేశమంతా 'సెక్యులర్' భావనతోనే వున్నది.

1947 ఆగస్టు 15న సింధు, పశ్చిమ పంజాబు, తూర్పుబెంగాలు రాష్ట్రాలు ముస్లిం మెజారిటీ కలిగియున్నందున దేశం నుండి వీడిపోయి పాకిస్తానుగా ఏర్పడ్డాయి. ఆనాటి నుండి అక్కడ సెక్యులర్ భావన అంత రించింది. పాకిస్తాను ఇస్లామిక్ రిపబ్లిక్ అనే మత రాజ్యంగా ఏర్పడింది. అచట సర్వమత సమభావన నశించింది.

హిందువులు అధిక సంఖ్యాకులుగా వున్న రాష్ట్రాలు ఇండియన్ యూనియన్‌గా ఏర్పడాయి. ఇందలి రాష్ట్రాలు 1947 ఆగస్టు 15కు పూర్వము, ఆ తరువాత గూడ సెక్యులర్ భావనతో కొనసాగుతున్నాయి. సర్వమత సమభావన వర్ధిల్లుతున్నది.

అంటే ఏమన్నమాట? ఇస్లామిక్‌తత్వం సెక్యూలరిజానికి వినాశ కారి. హిందూభావన సెక్యులరిజానికి దోహదకారి. ఈ కఠోర సత్యాన్ని అంగీకరించాలి.

ఒకవేళ ఇండియన్ యూనియన్‌లో 85 శాతం హిందువులకు బదులు 85 శాతం ముస్లిములు గనుక వుంటే ఇండియా సెక్యులర్ రాజ్యంగా కొనసాగగలదా? కొనసాగదు. సెక్యులరిజాన్ని గురించి గొంతులు చించు కొనేవారంతా ఈ సత్యాన్ని గ్రహించాలి.

అందుచేత సెక్యులరిజం అనేది హిందూ భావన తోటి, హిందువుల తోటి ముడిపడి వున్నది. ఒక ప్రాంతంలో హిందూ మెజారిటీ వున్నంత వరకే అచట అన్ని మతాలకు తగిన గౌరవ ప్రపత్తులుండి 'సెక్యులరిజం' కొనసాగుతుంది. హిందువులు అల్పసంఖ్యాకులైనపుడు సెక్యులరిజం అంత రిస్తుంది. కుహనా సెక్యులర్‌వాదులీ సత్యాన్ని గమనించడం లేదు.

## దేశ సమైక్యతకు హిందువులతో లంకె:

దేశ రాజధానియగు ఢిల్లీలో ప్రజల అలవాట్లకు, ఆహార విహారాలకూ ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, తమిళనాడుల లోని ప్రజల అలవాట్లకు, ఆహార విహారాలకూ, భాషలకూ చాలా తేడా వున్నది. ఢిల్లీ నుండి బెంగుళూరు, మదరాసు, కొన్నివందల మైళ్ళ దూరంలో వున్నాయి. అయినప్పటికీ ఈ రాష్ట్రాలన్నీ ఢిల్లీతో కలిసి వుంటున్నాయి. కారణం అక్కడా ఇక్కడా గూడా హిందువులే అధిక సంఖ్యాకులుగా వున్నారు.

ఢిల్లీ నుండి లాహోర్ చాల సమీపం. వందమైళ్ళ కంటె దూరం వుండదు. ప్రజల అలవాట్లు, మాట్లాడే భాష సన్నిహితంగానే వుంటాయి. అయినా లాహోర్ ఢిల్లీ నుండి విడిపోయింది. కారణం పశ్చిమ పంజాబులో హిందువులు అల్పసంఖ్యాకులు కావడం.

మరొక్క ఉదాహరణ. జమ్మూ-కాశ్మీర్ రాష్ట్రం వున్నది. అచట కాశ్మీర్ లోయలో వేర్పాటు ఉద్యమాలు తీవ్రంగా వున్నాయి. భారత స్వతంత్ర దినోత్సవంనాడు జాతీయ జెండాను తగులబెడుతున్నారు. ప్రభుత్వ భవనాలను దగ్ధం చేస్తున్నారు. అదే రాష్ట్రంలోని జమ్మూ విభాగంలో అలాంటివేవీ జరగడంలేదు. ప్రజలు భారతదేశానికి విధేయులుగా వున్నారు. ఎందువలన? హిందువులు అల్పసంఖ్యాకంగా వున్న ప్రదేశంలో జాతివ్యతిరేక చర్యలు జరుగుతున్నాయి; హిందువులు అధిక సంఖ్యాకులుగా వున్న ప్రదేశంలో దేశం ఎడల విధేయత, జాతీయ భావన వెల్లివిరిస్తున్నాయి.

అందుచేత ఇప్పటి ఇండియన్ యూనియన్‌లో వున్న ప్రతి రాష్ట్రంలోగూడ, ప్రతి జిల్లాలోనుగూడ, హిందువులు అధిక సంఖ్యాకులుగా

కొనసాగితేనే అవి భారతదేశంలో భాగాలుగా వుంటాయి. దేశసమైక్యత హిందువుల మీదనే ఆధారపడి వున్నది. ఈ కఠోర సత్యాన్ని ఎవ్వరూ ఎన్నటికీ విస్మరించగూడదు.

పైన వివరించినట్లు దేశంలో సెక్యులరిజం కొనసాగాలన్నా, దేశ సమైక్యత కాపాడబడాలన్నా, అది హిందూ మెజారిటీమీద ఆధారపడి వున్నది.

## దేశం యొక్క బాధ్యత హిందువులది :

దేశంలో హిందువులు, ముస్లిములు, క్రైస్తవులు, పార్సీలు వున్నారు. ఐతే ఈ దేశంయొక్క బాధ్యత ప్రధానంగా ఎవరిది? ఈ ప్రశ్నకు సరియైన సమాధానం గ్రహించాలి.

1. చైనా సైన్యాలు 1962 అక్టోబరులో భారత సరిహద్దుల నతిక్రమించి అస్సాముమీద, లఢక్ మీద దండయాత్ర చేసినపుడు భారత సైన్యం ఘోరంగా ఓటమి చెందింది. ఆ పరాజయం గురించి వ్యాఖ్యానిస్తూ ఒక పాశ్చాత్య దినపత్రిక "హిందువులు యుద్ధాలేమి చేయగలరు?" అని విమర్శించింది. భారత సైన్యంలో క్రైస్తవులు, ముస్లిములు పలువురున్నప్పటికీ పరాజయం సంభవించినపుడు హిందువులనే విమర్శించారు.

2. అలాగే మరొక ఉదాహరణ :

ఒక దేశం ఆర్థికంగా పురోగతి చెందాలంటే ఆ దేశపు ఆర్థికాభివృద్ధి ఏడాదికి 5 లేక 6 శాతం వరకు వుండాలి. అపుడే ఆ దేశం అభ్యున్నతి సాధిస్తుంది. కాని స్వతంత్రం వచ్చిన పిదప చాల కాలంవరకు భారతదేశంలో ఆర్థికాభివృద్ధి 3 శాతం మించలేదు. దీనిపై ప్రముఖ ఆర్థిక

శాస్త్రవేత్త డా॥ రాజ్‌కృష్ణ వ్యాఖ్యానిస్తూ "ఇది హిందూ అభివృద్ధిరేటు" (This is Hindu rate of grouth) అని హేళనగా అన్నాడు. అంటే హిందువులు పని చేయరనీ, సోమరులనీ అందుచేత అభివృద్ధిరేటు అంత తక్కువగా వున్నదని అతని వ్యాఖ్య.

దేశంలో హిందువులు కానివాళ్ళు 15 శాతం వరకు వుండగా అతడు హిందువులనే ఎందుకు నిందించాలి?

3. ఇంకొక ఉదాహరణ :

ఫ్రాన్సుదేశాన్ని 17 వ శతాబ్దంలో 13 వ లూయీ పరిపాలించాడు. అతనివద్ద కోల్‌బర్ట్ అనే మంత్రి వున్నాడు.

ఒకనాడు మంత్రి రాజుతో "ఆసియా ఖండంలో భారతదేశం సంపదగల దేశం. ఆ దేశంతో వాణిజ్యం చేయడానికి మన దేశీయులను పంపి, క్రమంగా అచట మన వలసరాజ్యం స్థాపించుదాం. మీ ఆమోదం కొరకు వేచి యున్నాను" అన్నాడు.

అందుకు రాజు "కోల్‌బర్ట్! నీకు భారతదేశంగురించి తెలియదేమో. అది చాల ప్రాచీనమైన దేశం. అచట హిందూ నాగరికత అనాదినుంచీ వున్నది. రాజులు, రాజ్యాలు వున్నాయి. వారికి సైన్యాలు, కోటలు వున్నాయి. అలాంటి చోటికి వెళ్ళి మనవాళ్ళు వలస రాజ్యాలు ఎలా స్థాపిస్తారు? జనులు నివసించకుండా నిర్మానుష్యంగా వున్న ప్రదేశాలు ఏ ఖండాలలో వున్నాయో చూడు. అచటికి మనవాళ్ళు పోయి రాజ్యాలు స్థాపించడం మంచిది" అన్నాడు.

అందుకు కోల్‌బర్ట్ : "రాజా ! భారతదేశంలో హిందువులున్న మాట వాస్తవమే. కాని హిందువుల యొక్క మెతకదనము, అర్భకత్వము

ప్రపంచానికంతటికీ తెలుసు. (The weekness and mildness of the Hindus is well known to the world). అచటికి పోర్చుగీసువారు వెళ్ళారు; డచ్చివారు వెళ్ళారు. మనవాళ్ళను గూడ పంపుదాం" అన్నాడు.

భారతదేశంలో ఆనాడు గూడ హిందువులు కానివారు అసంఖ్యాకంగా వున్నారు. అయినప్పటికీ కోల్‌బర్ట్ హిందువుల లోపాన్ని మాత్రమే ఎందుకు పేర్కొన్నాడు ?

దీనికి ఒక్కటే కారణం. ఏ దేశంలోనైనా ఆ దేశం యొక్క మంచిచెడ్డలు, మానావమానాలు ఆ దేశంలోని అధిక సంఖ్యాకవర్గం మీదనే ఆధారపడి వుంటాయి. అందువలననే పైన చెప్పిన సైనిక, ఆర్థిక రంగాలలో వైఫల్యాలకు విమర్శకులు హిందువులనే వేలెత్తి చూపారు.

మీరొక్క సంగతి. 1962 అక్టోబరులో చైనాతో యుద్ధం జరుగుతున్న రోజులలో ఒకనాటి సాయంకాలం రేడియోలో "దేశాన్ని శత్రువుల బారినుండి రక్షించడానికై ప్రతిపౌరుడు సన్నద్ధం కావాలని శ్రీ కంచి కామకోటి పీఠాధిపతులు శ్రీచంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి వారు ప్రజలను ఉద్బోధించారు" అని చెప్పారు.

మరికొన్ని నెలలకు "నీఫాలో భారత సైనిక శిబిరాలలో శ్రీకృష్ణ జయంతిని వైభవంగా జరుపుకున్నారు" అని మరొక వార్త పత్రికల్లో వచ్చింది. ఈ రెండు వార్తలను ప్రభుత్వం ఎందుకు ప్రత్యేకంగా వెల్లడించింది?

ఏ దేశపు ఉన్నతిగాని పతనంగాని ఆదేశంలో వున్న అధికసంఖ్యాకుల మీద ఆధారపడివుంటుంది. మనదేశంలో అధికసంఖ్యాకులు హిందువులు

వారిని త్తేజపరిస్తేనే జాతి ఉత్తేజం చెందుతుంది. దేశం వైఫల్యాలను పొందినపుడు, కష్టాలు వచ్చినపుడు ఈ సత్యం గుర్తుకు వస్తున్నది. అలా గాక ఎల్లప్పుడు గుర్తుంచుకోవలసిన సత్యమిది.

## హిందూభావన 'కమ్యూనల్' అవుతుందా ?

ఈ సత్యాన్ని గ్రహించక పోగా దేశంలోవున్న చాలా మంది మేధావులు, పత్రికా రచయితలు, విద్యావేత్తలు, రాజకీయ వాదులు గూడ "హిందూ" అనే శబ్దాన్ని వినడానికిగాని, పలకడానికి గాని ఇష్టపడటం లేదు. ఎందుకంటే, 'హిందు' అనే భావన 'కమ్యూనల్' అని వారి ఉద్దేశ్యం. అందుచేత దేశ సమగ్రతకు, జాతీయ సమైక్యతకు ఏ భావన అయితే పునాదిగా వున్నదో, ఆ హిందూ భావనను వారు అభిమానించక పోగా దానిని ఉచ్చరించడానికిగూడ తిరస్కరిస్తున్నారు. ఇది అత్యంత ఆశ్చర్య కరము, విషాదకరము అయిన పరిస్థితి. 'కమ్యూనల్' అనే ఆరోపణను ఎవరికి వర్తింపచేయరాదో వారికి వర్తింపచేయడంవల్ల ఇలా జరుగుతున్నది.

అసలు 'కమ్యూనల్' అంటే అర్థమేమిటి? 'మతపరమైన సంకుచిత భావన'ను కమ్యూనల్ అని అంటారను కోవచ్చు.

సమాజంలో ఒక మత వర్గానికి సంబంధించిన ఆకాంక్షల కొరకు ప్రయోజనాలకొరకు మాత్రమే పనిచేస్తూ (కేవలం అలా పనిచేయడం తప్పుగాదు), తద్వారా దేశ విచ్ఛిత్తికి గాని, దేశంలోని మిగతా మతస్థుల వినాశనానికిగాని దారితీసే తత్వాన్ని, కమ్యూనల్ అనవచ్చును. తెలుగులో దీనికి 'మతోన్మాదం' అనే పదం వాడుతున్నారు.

మరి హిందూ భావన 'మతోన్మాదం' క్రిందికి వస్తుందా? అది 'కమ్యూనల్' అవునా కాదా అని ప్రశ్న.

హిందూభావన దేశవిచ్ఛిత్తికి దారితీయ లేదు; మిగతా మతస్థుల వినాశనానికి దారితీయలేదు. అందుచేత, హిందూభావన 'కమ్యూనల్' కానే కాదు. మరి ఎందువల్ల కమ్యూనల్ అని నిందిస్తున్నారు?

దేశ విచ్ఛిత్తికి, రక్తపాతానికీ దారితీసిన ముస్లిం మతతత్వం ఎలా కమ్యూనలో, అలాగే హిందూభావన గూడ కమ్యూనలే నని కుహనా సెక్యూలరిస్టుల వాదం. వాళ్ళు ఎప్పుడూ ముస్లిం మతతత్వాన్నీ, హిందూ భావననూ ఒకేగాటన కట్టివేసి మాట్లాడుతారు.

ఐతే వాళ్ళ వాదనలో మరొక చిత్రమైన వైపరీత్యం గూడ చోటు చేసుకొని వున్నది. అదేమిటంటే ముస్లిములు క్రైస్తవులు అల్పసంఖ్యాక మతవర్గాలు గనుక, రాజ్యాంగరీత్యా వారి మత పరిరక్షణకు హామీ ఇవ్వ బడింది గనుక, ముస్లిం మతతత్వం గాని, క్రైస్తవ మతతత్వం గాని మన్నించతగినది, అనుమతించతగినది; హిందూ మతతత్వం మాత్రం సహించరానిది, ఖండించవలసినది, తల ఎత్తకుండా అణచి వేయవలసినది అని వీరి భావం.

అందుకే ధైర్యంగా ముస్లిం, క్రైస్తవ మతములను బహిరంగంగా అభినందిస్తూ గౌరవిస్తూ ప్రసంగాలు చేస్తారు. ఆ పదాలను ఉచ్చరిస్తారు. క్రిస్టియన్ మిషన్ కార్యకలాపాలలో రాజకీయ పార్టీల నాయకులు వెళ్ళి స్వయంగా పాల్గొనడానికి సంవేహించరు. కాని హిందూసంస్థల కార్య క్రమాలలో మాత్రం పాల్గొనరు. హిందూ అనే పదాన్ని నోటితో పలకరు. రహస్యంగా ఇంట్లో హిందూ దేవుళ్ళను ఆరాధిస్తారు. బయటికి మాత్రం తాము హిందువులమని చెప్పుకోరు. ఎందుకంటే 'హిందూ' అనే పదం కమ్యూనల్ అంటారు!

కుహనా సెక్యులరిస్టులు ఇలా భావించడానికి రెండు కారణాలున్నాయి.

1. జవహర్‌లాల్ నెహ్రూ ఒకసారి ప్రసంగిస్తూ "అల్ప సంఖ్యాకుల మత భావన అర్థంచేసుకోదగినది, సహించదగినది. కాని అధిక సంఖ్యాకుల మత భావన (Communalism) సహించరానిది; నిర్మూలింపవలసినది" అని అన్నాడు. ఈ వాక్యమే కుహనా సెక్యులరిస్టులకు తారకమంత్రంగా ఉన్నది.

నెహ్రూ ఆలోచనే తప్పు. ఎవరి మత భావన దేశ సమైక్యతకు భంగకరం? ఎవరి మత భావన దేశ సమైక్యతకు దోహదకారి? అని ఆలోచించకుండా, కేవలం అధిక సంఖ్యాకులవలన అల్ప సంఖ్యాకులు కష్టాల పాలవుతారనే ఊహను కల్పించుకొని ఆయన అలా మాట్లాడాడు. అలా మాట్లాడటమే పెద్ద తప్పు.

2. మొదటి ప్రపంచ యుద్ధానంతరం అమెరికా అధ్యక్షుడు వుడ్రోవిల్సన్ "ఏ దేశంలోనైతే అల్పసంఖ్యాక వర్గాల వారికి తగిన రక్షణ వుంటుందో అదియే సరియైన ప్రజాస్వామ్యం అవుతుంది" అని అన్నాడు. అతడు ఈ మాటను ఐరోపాలో యుద్ధానంతరం ఏర్పడిన రాజ్యాలను దృష్టిలో వుంచుకొని చెప్పాడు. పోలెండులో జర్మన్ జాతీయులు, హంగరీలో ఆస్ట్రియన్ జాతీయులు— ఇలా ఒక దేశంలో మరొక జాతీయులు అల్పసంఖ్యాకులుగా నివసిస్తున్నారు. కనుక అట్టి అల్పసంఖ్యాకులకు తగిన రక్షణ వుంటేనే అది ప్రజాస్వామ్యం అని అన్నాడు.

ఆ మాటను మన దేశానికి వర్తింప చేసుకొని ఇక్కడ గూడ అల్ప సంఖ్యాకులకు రక్షణ అనే సూత్రాన్ని వల్లించి వారికి ప్రత్యేక ప్రయోజ

నాలు కలిగించడం కోసం రాజ్యాంగంలో వారికొరకు మత, సాంస్కృతిక పరిరక్షణ హక్కు అనే ప్రాథమిక హక్కును ఏర్పాటు చేశారు.

ఐతే ఇక్కడ గమనించవలసిన సంగతేమిటంటే, ఐరోపా రాజ్యాలలోవలె మన దేశంలో అల్పసంఖ్యాకు లనబడేవారు మరొక దేశానికి చెందిన పరాయి జాతీయులు కారు వీరందరు భారత జాతీయులే. వుడ్రోవిల్సన్ చెప్పిన మాట వీరికి సంబంధించినది కాదు. అంతేగాక మతాన్నిబట్టి అల్పసంఖ్యాకులని నామకరణం చేయడం దేశానికి శ్రేయస్కరం కాదు ఒకసారి మతాన్నిబట్టి దేశం రెండు ముక్కలయింది గదా. మరల మతాల వారీగా అల్పసంఖ్యాకులని పిలవడం వలన వారిలో వేర్పాటు ధోరణులు కొనసాగుతాయని పరిపాలకులు గ్రహించకపోవడం వారు చేసిన పెద్ద తప్పు. ఏ మతానికి చెందినవారైనా భారతీయులే అని వ్యవహరించడం సరియైన పద్ధతి.

## కుహనా సెక్యూలరిస్టుల ఆలోచనల్లో దోషాలు :

కుహనా సెక్యూలరిస్టుల ఆలోచనల్లో, వారి వాదనల్లో ఈ క్రింది దోషాలు చోటు చేసుకొని వున్నాయి. వాటిని సాకల్యంగా పరిశీలిద్దాము.

1. సర్వసాధారణంగా అధిక సంఖ్యాకులు అల్ప సంఖ్యాకులను బాధలకు లోనుచేస్తారని లోకంలో ఒక స్థిరమైన అభిప్రాయం వున్నది. కాని భారతదేశ చరిత్రలో ఇందుకు విరుద్ధంగా జరిగింది. ఈ దేశం మీదకు కొద్దిమంది దండెత్తివచ్చి ఎక్కువ మందిని ఓడించి దేశాన్ని పాదాక్రాంతం చేసుకున్నారు. అల్ప సంఖ్యగల వారి నుండి అధిక సంఖ్యాకులకు రక్షణలేని దుస్థితి చరిత్రలో కానవస్తుంది. ఇది యొక విచిత్రమైన చారిత్రక సత్యం. కనుక వారి వారి చర్యలను బట్టి అవి

మంచివో చెడ్డవో నిర్ణయించాలి గాని అల్ప సంఖ్యాకులు గనుక వారు ఎప్పుడూ తప్పుచేయరనీ, అధిక సంఖ్యాకులు నిరంతరం ఇతరులను పీడి స్తారనీ ఊహించడం సమంజసం కాదు.

2. ఏ దేశంలోనైనా అధిక సంఖ్యాకుల ఆలోచనా విధానం ఆ దేశపు జాతీయతకు ప్రాతిపదికగా వుంటుంది. ఇంగ్లండులో క్రైస్తవ భావన గాని, ఇజ్రాయిల్‌లో యూదు భావన గాని, టర్కీలో ఇస్లాం భావన గాని సంకుచితము, కమ్యూనల్, కానేకావు. అలాగే భారతదేశంలో అధిక సంఖ్యాకులైన హిందూ భావన కమ్యూనల్ కాదు. అది జాతీయతకు పునాదిరాయిగా నిలుస్తుంది. అట్టి హిందూ భావనను కమ్యూనల్ అనీ సంకుచితమనీ తప్పుగా చిత్రించి దేశం అనెడి మహావృక్షం యొక్క తల్లి వేరును మొదలంట నరకడానికి కుహనా సెక్యులరిస్టులు ప్రయత్నిస్తు న్నారు.

3. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని ప్రాణాలర్పించిన వారిలో నూటికి 99 మంది హిందువులే. వారికి ప్రేరణ ఇచ్చింది గూడ హిందు త్వమే. మహాత్మాగాంధీ రామనామ స్మరణతో ప్రజలను ఆకట్టుకొనేవాడు. దుగ్గిరాల గోపాలకృష్ణయ్య దేశసేవకై 'రామదండు' అనే వాలంటీరు దళాన్ని స్థాపించాడు. మహమ్మదాలీ జిన్నా కాంగ్రెస్‌ను హిందువుల పార్టీ అనేవాడు. దేశంలో 85 శాతం ప్రజలు హిందువులైనపుడు ముస్లిం లీగు మినహా అన్ని పార్టీలలోనూ హిందువులే అత్యధికంగా వుంటారు. ఒక్క కాంగ్రెసేకాదు. కమ్యూనిస్టు, సోషలిస్టు, జస్టిస్ పార్టీ, ద్రవిడకజగం, తెలుగుదేశం, శివసేన, జనతాదళ్, లోకదళ్— ఈ పార్టీల నాయకు లందరూ హిందువులే. వీటిలో ఏ ఒక్క పార్టీకైనా హిందువులు కానివారు నాయకులుగా వున్నారా? నంబూద్రిపాద్, సి. హెచ్. రాజేశ్వరరావు,

జ్యోతిబసు, బసవపున్నయ్య, ఎన్. టి. రామారావు, వి పి సింగ్, దేవీలాల్, రామకృష్ణ హెగ్డే. జాల్ధాక్రే, జయప్రకాశ్ నారాయణ్, రామ మనోహర లోహియా — వీరంతా హిందువులు కారా? అలాంటపుడు హిందుత్వాన్ని సంకుచితమని నిందించడం జాతీయ భావాన్ని అవమానించడమవుతుంది. దేశభక్తి యొక్క ఆలంబనాన్ని నరికివేయడ మవుతుంది ఒక విధంగా దేశద్రోహానికి దారితీస్తుంది.

## హిందూత్వం వికసిస్తే అల్ప సంఖ్యాకులకు ప్రమాదమా?

దేశంలో హిందువులు హిందూ భావనను పెంపొందించుకున్నట్లయితే, దానివలన అల్పసంఖ్యాక మతవర్గాల వారికి ప్రమాదం కాదా? అని మరొక ప్రశ్న,

ఇలా ప్రశ్నించేవారు ముస్లిం మతతత్వం కారణంగా పాకిస్తానులో లక్షలాది హిందువులు నామరూపాలు లేకుండా పోయారనే సంగతి గురించి బాధపడరు. భారత దేశంలోనే ముస్లింజనాధిక్యతగల కాశ్మీరులో 1987 ఫిబ్రవరిలో 54 హిందూ దేవాలయాలపై దాడులు జరిగి నేలమట్టమయితే ఆ దాడులను వీరు ఖండించరు. ఆ దాడులుచేసిన వారిపై చర్యతీసుకోవాలని కోరరు. అచటి హిందువుల రక్షణకై చర్యలు తీసుకోవలసిందిగా ప్రభుత్వాన్ని కోరరు. అచట హిందూ దేవాలయాలు నాశనమైనాయనే వార్తను గూడ పత్రికలలో రానివ్వరు. కేవలం హిందూత్వం వలననే మిగతా వారికి ఏదో ముప్పు ఏర్పడుతుందని అసత్య ప్రచారం చేస్తారు. గావుకేకలు పెడతారు.

ఐనప్పటికీ అసలు సత్యమేమిటంటే, ఇక్కడి అల్పసంఖ్యాక మత వర్గాలవారికి హిందూభావన పెంపొందడం వలన ఎట్టి ప్రమాదం వుండదు.

ఎందువల్లనంటే, హిందూసిద్ధాంతం ప్రకార నీవు ఏదేవుని ఆరాధించినా, ఆ ప్రార్థనలన్నీ ఒకే పరమేశ్వరునికి చేరుతాయి.

"ఆకాశాత్ పతితం తోయమ్
యథాగచ్ఛతి సాగరమ్
సర్వ దేవనమస్కారః
కేశవం ప్రతిగచ్ఛతి."

ఆకాశము నుండి భూమిమీద పడిన నీరంతా ఏ విధంగానైతే తుదకు సముద్రమును చేరుతుందో, అట్లే వివిధ దేవతలకు చేసే నమస్కారాలు తుదకు ఆ కేశవునకే చేరుతాయి — అని హిందువుడు ప్రతిదినము భావన చేస్తాడు. ప్రతిదినం సంధ్యావందన సమయంలో ఈ శ్లోకాన్ని పలుకుతాడు. ఈ భావనయే సర్వమత సమభావనకూ, తద్వారా సరియైన సెక్యులర్ తత్వానికి ప్రాతిపదికగా నిలుస్తుంది.

ఇందుకు తార్కాణంగా తమ దేశముల నుండి ముస్లిం దండయాత్రలవలన తరిమి వేయబడిన యూదులకు, పార్శీలకు భారతదేశంలో హిందూ రాజుల నుండి ఎట్టి ఆశ్రయము, రక్షణ లభించిందో తెలుసుకొంటే ఆశ్చర్యం వేస్తుంది. ఇటీవల రచించబడిన యూదుల చరిత్ర అనే గ్రంథంలో ప్రపంచంలో అన్ని దేశాలలో కంటే హిందువుల దేశంలోనే తమకు మత స్వేచ్ఛ, వ్యక్తిస్వేచ్ఛ లభించాయని దాని రచయిత పేర్కొన్నాడు.

పార్శీలు తమ దేశంనుండి తరిమివేయబడి గుజరాత్‌కు వచ్చి అచటి హిందూ రాజును కలుసుకొని తమ కానుకగా క్షీరమును తెచ్చి రాజునకు సమర్పించారు. రాజు చెక్కెర తెప్పించి ఆ క్షీరములో మిళితం

చేయించి "ఈ క్షీరముతో చెక్కెర కలిసి వున్నట్లు మీరు మేమూ ఇచట సుఖంగా జీవిద్దాం" అని వారికి ఆశ్రయ మివ్వడం జరిగింది. ఆనాడు గుజరాత్‌లో ఆశ్రయం పొందిన పార్శీ సంతతి వారే ఈనాడు దేశంలో పారిశ్రామిక వేత్తలుగా, విద్యావేత్తలుగా వివిధరంగాలలో రాణిస్తున్నారు.

ఇలాంటి ఉదాత్తమైన ఉదారమైన, ఉన్నతమైన, మానవత్వానికి మరో పేరైన హిందుత్వాన్ని సంకుచితం అని నిందించడం ఎంత విచార కరం! ఎంత బాధాకరం!

## దేశశ్రేయస్సుకు అనుకూలు రెవరు? వ్యతిరేకులెవరు?

ఇంతకు పూర్వం వివరించినట్లు దేశంలో ఈనాడు సెక్యూలర్, కమ్యూనల్ అనేపదాలు ప్రజలను తప్పుత్రోవలు పట్టించే రీతిలో ప్రయో గింపబడుతున్నాయి. కుహనా సెక్యూలరిస్టులు హిందూ వ్యతిరేకతను, అల్పసంఖ్యాక మతవర్గాల అనుకూలతను 'సెక్యూలరిజం'గాను, హిందూ భావనయే 'కమ్యూనలిజం' గాను వక్రీకరిస్తున్నారు. అల్పసంఖ్యాక మత తత్వాన్ని మన్నించ తగినదిగాను ప్రోత్సహించతగినదిగాను వక్రభాష్యాలు చెప్పి దేశప్రజలను తప్పుద్రోవలు పట్టిస్తున్నారు.

అందుచేత బంగారానికి పరీక్ష అగ్నిలో కాల్చడమే అయినట్లు జటిల మైన ఈ సమస్యను తేల్చడానికి మరొక మార్గమున్నది. అదేమిటంటే, జాతివ్యతిరేకచర్యలకు, దేశవిద్రోహకర చర్యలకు ఆలంబనం హిందూ భావనవలన వస్తున్నదా లేక అల్పసంఖ్యాక మతతత్వం వలన వస్తున్నదా అని ప్రశ్నించుకోవాలి.

1. భారత జాతీయగీతాన్ని ఆలాపించడం మా మత విశ్వాసాలకు విరుద్ధం గనుక మేము వందేమాతరం గీతాన్ని ఆలపించమని కేరళలో తిరస్కరించిన వారెవరు?

2. కాశ్మీర్‌లో 1989 ఆగస్టు 15 న భారత జాతీయ పతాకాలను దగ్ధం చేసి వాడవాడలా విదేశీ పతాకాలను ఎగురవేసిన దెవరు?

3. భారత రిపబ్లిక్ దినోత్సవాలను బహిష్కరించవలసినదిగా 1988 జనవరిలో పిలుపునిచ్చిన దెవరు?

4. ప్రపంచ క్రికెట్ పోటీలలో భారతజట్టు ఓడిపోయినపుడు, ఇండియా వికెట్లు పడిపోయినపుడు స్వీట్లుపంచుకొని జల్సా చేసుకుంటున్న దెవరు?

5. 1987 మార్చి 30 తేదీన దేశ రాజధాని ఢిల్లీలో భారత రాజ్యాంగాన్ని మేము ఖాతరుచేయం, ఇండియా చట్టాలు మాకు వర్తించవు అంటూ దేశద్రోహకర ప్రసంగాలు చేసిన దెవరు?

పై ప్రశ్నలకు జవాబు అధికసంఖ్యాక మతస్థులు కారు. అల్ప సంఖ్యాక మతవర్గాల వారే పై పనులు చేశారు, చేస్తున్నారు. దేశానికీ జాతికీ ఏ మత తత్వం వలన అపకారం జరుగుచున్నదో అదే సంకుచి తత్వం. కమ్యూనలిజం. అది హిందూభావనవలన మాత్రం జరగదు. ఈ సత్యాన్ని ఎల్లరూ గుర్తించాలి.

1983 నవంబరు, డిసెంబరులలో భారతదేశ సమైక్యతను ఉద్బోధిస్తూ అపూర్వమైన కార్యక్రమం ఒకటి జరిగింది. ఉత్తరమున హరిద్వారములోను, తూర్పున గంగాసాగరంలోను గంగానదీ జలాలను నింపుకున్న రెండు పూర్ణ కుంభాలు అతి సుందరంగా అలంకరించబడిన భారత మాత యొక్క ప్రతిమతో సహా రథముల మీద అమర్చబడి ఒకటి దక్షిణాభిముఖంగా రామేశ్వరానికీ, మరొకటి పశ్చిమాభిముఖంగా గుజరాత్‌లోని సోమనాథ్‌కు పయనించాయి. రోజుకు 100 కి.మీ. పయనిస్తూ రోజుకు నాలుగు చోట్ల రెండేసిగంటలపాటు ఆగినాయి. అవి ఆగిన చోట్లకు చుట్టు ప్రక్కల వందలాదిగ్రామాలనుండి ప్రజలు లక్షలసంఖ్యలో వచ్చి దేశభక్తి

పోతే హిందూదేశం వుండదు సుమా" అని పాశ్చాత్య వనితామణి అనీబిసెంట్ 1915 లో హెచ్చరించినది. దేశం యొక్క సమైక్యత, సమగ్రత హిందూత్వం మీద ఆధారపడి వున్నది.

అసలు ఈ దేశం మీద దండయాత్రలు చేసిన విదేశీయులతో యుద్ధాలు చేసి రక్తంకార్చిన దెవరు? హిందువులు. భారత జాతీయోద్యమాలలో పాల్గొని జీవితాలనర్పించిన దెవరు? హిందువులు. వారికి స్ఫూర్తినిచ్చిన గ్రంథములు రామాయణము, భగవద్గీతలే.

ఐనప్పటికీ ఇ.ఎమ్.ఎస్. నంబూద్రిపాద్ లాంటి కుహనా సెక్యులరిస్టులు హిందూ వ్యతిరేకతయే సెక్యూలరిజం, అల్పసంఖ్యాక మతవర్గాల సంతుష్టీకరణమే సెక్యులరిజం, అనే చెడ్డ అర్థాలను ప్రచారం చేసి జాతి వృక్షం యొక్క తల్లివేరును నరికివేస్తున్నారు. టెలివిజన్‌లో, రేడియోలో, పత్రికల్లో, విద్యారంగంలో ఈ తప్పుడు అర్థాన్ని ప్రచారంలోకి తీసుకొని వచ్చి జాతియొక్క ఆత్మను చంపివేస్తున్నారు. అందుమూలాన ఈ క్రింది పరిణామాలు కలుగుతున్నాయి.

## 1. చట్టాల నుండి అల్పసంఖ్యాక మతముల విద్యా సంస్థలకు మినహాయింపు :

రాష్ట్ర ప్రభుత్వాలు విద్యావిషయిక చట్టాలను చేస్తూ వుంటాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం శ్రీ మండలి వెంకట కృష్ణారావు గారు విద్యా మంత్రిగా వుండగా ఒక విద్యా చట్టాన్ని ప్రవేశపెట్టింది. విద్యాలయాల నిర్వహణలో అక్రమాలు జరిగితే ఆయా విద్యాలయాలను స్వాధీనం చేసుకోవడానికి అందులో ప్రభుత్వానికి అధికారం యివ్వబడింది. ఐతే, ఆయా క్లాజులు అల్పసంఖ్యాక మతస్తులు నడిపే విద్యా సంస్థలకు వర్తించవని చట్టంలో స్పష్టంగా పేర్కొన్నారు. ఎందుకిలా పేర్కొన్నారు? ఆ సంస్థలలో జరిగే అక్రమాలను శిక్షించే అధికారం ప్రభుత్వానికి ఉండనక్కరలేదా? ఈ వివక్షత ఎందుకు చూపబడింది?

**పౌరసత్వానికి నోచుకోని హిందూ శరణార్థులు :**

2. దేశ విభజన సమయంలో అనగా 1947 లో పశ్చిమ పాకిస్తాను నుండి 80 వేల మంది హిందువులు జమ్మూలోకి శరణార్థులుగా వచ్చి స్థిరపడ్డారు. 42 సంవత్సరాలు గడచినా వారికి భారతదేశ పౌరసత్వం ఇవ్వబడలేదు. వారికి ఓటు హక్కు ఇవ్వబడలేదు. తూర్పు పంజాబులోకి పాకిస్తాను నుండి వచ్చిన హిందూ శరణార్థులు ఓటర్లు అయినారు. పౌర సత్వం పొందారు. కాని జమ్మూ - కాశ్మీర్ రాష్ట్రంలోకి వచ్చి స్థిరపడ్డ వారికి ఆ రాష్ట్ర ప్రభుత్వం ఎందువలన పౌరసత్వం ఇవ్వలేదు? అది భారతదేశంలో అంతర్భాగమే గదా?

**ప్రపంచ ముస్లిం రాజ్యాల మహాసభకు భారత ప్రభుత్వ ప్రతినిధివర్గం:**

3. శ్రీమతి ఇందిరాగాంధీ ప్రధాన మంత్రిగా వున్నపుడు ఉత్తరాఫ్రికాలోని రాబత్‌నగరంలో ప్రపంచ ముస్లిం రాజ్యాల మహాసభ జరిగింది. అందులో పాల్గొనడానికై భారత ప్రభుత్వం తరఫున ఒక ప్రతినిధివర్గం పంపబడింది! ఐతే ఆ సభవారు భారతదేశం ఇస్లామిక్ రాజ్యం కాదు గనక మీరు పాల్గొన రావంటూ ప్రతినిధివర్గాన్ని వెనుకకు పంపారు. అసలు అట్టి ప్రతినిధివర్గాన్ని ఇస్లామిక్ రాజ్యాల మహాసభకు భారత ప్రభుత్వం ఎందుకు పంపింది? ఈదేశం ఇస్లామిక్ రాజ్యమేనని పాలకుల అభిప్రాయమా?

**తమది హిందూసంస్థకాదని ప్రకటించిన రామకృష్ణ మిషన్ :**

శ్రీరామకృష్ణ పరమహంస, స్వామివివేకానంద హిందూధర్మానికి పునర్వికాసం కలిగించారు. ప్రాణప్రతిష్ఠచేశారు. వివేకానందుడు స్థాపించిన శ్రీరామకృష్ణ మిషన్ హిందూవేదాంతానికి పట్టుగొమ్మగా వర్ధిల్లుతున్నది. సనాతన ధర్మానికి ప్రతీకగా నిలచింది.

అలాంటి రామకృష్ణ మిషనేతమది హిందూ సంస్థ కాదనీ, తమది ఒకమైనారిటీ సంస్థఅనీ కలకత్తా హైకోర్టులో అఫిడవిట్టు దాఖలుచేసే

దారుణ పరిస్థితి ఏర్పడింది. ఇందుకు కారణమేమి టంటే, శ్రీరామకృష్ణ మిషన్ నిర్వహించే అన్ని విద్యా సంస్థలలోను ఉపనిషత్తులు, హిందూ వేదాంతము గురించిన తరగతులు నిర్వహిస్తారు. అలా ఎన్నో సంవత్స రాలుగా జరుగుతున్నది. అట్టిబోధన ఇష్టంలేని విద్యార్థి యొకడు అలా బోధించడం రాజ్యాంగ విరుద్ధమనీ, అట్టిబోధనను ఆపించాలనీ కలకత్తా హైకోర్టులో పిటిషన్ దాఖలు చేశాడు.

రాజ్యాంగరీత్యా 28 వ క్లాజు ప్రకారం ప్రభుత్వ గ్రాంట్లుపొందే ఏ విద్యా సంస్థలోనూ మతబోధ చేయడం నిషిద్ధం. రామకృష్ణ మిషన్‌నడిపే విద్యాలయాలు ప్రభుత్వ గ్రాంటులను స్వీకరిస్తున్నాయిగనక ఆ సంస్థ లలో హిందూ మతబోధచేయరాదు.

ఐతే, రాజ్యాంగంలో 30 వ క్లాజుప్రకారం మతరీత్యాగాని, భాష రీత్యాగాని అల్పసంఖ్యాకులైనవారు తమ ఇష్టప్రకారం విద్యాసంస్థలను స్థాపించి నడుపుకోవచ్చు. ప్రభుత్వం వాటికి గ్రాంట్లు ఇవ్వడంలో వివక్షత చూపదు.

ఈ 30 వ క్లాజుప్రకారం దేశంలో అల్పసంఖ్యాక మత వర్గాల వారు విద్యా సంస్థలను స్థాపించి అందులో తమ తమ మతబోధలుగూడ చేస్తున్నారు. ఇందుకు ప్రభుత్వం నుండి ఎట్టి అభ్యంతరం లేదు. అందు చేత రామకృష్ణ మిషన్ నడిపే విద్యా సంస్థలుగూడ రాజ్యాంగంలోని 30వ క్లాజు క్రిందకు రావడం కొరకు తమది హిందూసంస్థ కాదనీ, తమది విశ్వజనీనమైన తాత్విక దృష్టిగల మైనారిటీ సంస్థ అని ప్రకటించుకొనే విచిత్ర పరిస్థితి ఏర్పడింది.

ఈ మైనారిటీ మతాలకు ఇవ్వబడిన ఏ ఏ అవకాశాలున్నవో అవి హిందూమతానికి ఇవ్వబడనందున హిందువులే తాము హిందువులము కామనీ, తాము మైనారిటీలమని ప్రకటించుకొనే వికృత పరిస్థితి దేశంలో

వున్నది. అంతేగాక, విశ్వహిందూ పరిషత్ ఒక తీర్మానంలో "అల్ప సంఖ్యాక మత వర్గాల వారితో సమానంగా అధిక సంఖ్యాక మత వర్గానికి ప్రయోజనాలు కల్పించబడాలి" అని కోరే పరిస్థితి ఏర్పడింది.

ఇలా చెప్పుకుపోతే సెక్యులరిజం వేస్తున్న వెర్రితలల గురించి ఎంతైనా చెప్పవచ్చు.

దేశంలో హిందూమతాన్ని లేకుండా చేయడం సెక్యూలరిజం యొక్క లక్ష్యం కాదు. దేశాన్ని ధర్మరహితంగా, నీతి బాహ్యంగా చేయడం సెక్యూలరిజం లక్ష్యం కాదు. అల్పసంఖ్యాక మత వర్గాల వారికి దేశంలోని చట్టాలు వర్తింపకుండా చేసి వారిలో దేశం ఎడల అవిధేయతను కలిగించడం సెక్యూలరిజం యొక్క పరమావధి కాదు. అయినప్పటికీ నేడు కుహనా సెక్యూలరిజం వల్ల కలుగుతున్న ఫలితమిదే.

1. సెక్యూలరిజం అనగా సర్వమత సమ భావన. అది హిందూ ధర్మంలో అంతర్లీనంగా వ్యాపించి వున్నది.

2. సెక్యూలరిజం ముసుగుతో దేశంలో విచ్ఛిన్నకర శక్తులు పెంపొందుతున్నాయి.

3. దేశం యొక్క బాధ్యత హిందువులది. ముమ్మాటికీ హిందువులది. ఆ సత్యాన్ని హిందువులు గమనించి బాధ్యత వహించి దేశ పరిస్థితులను చక్కదిద్దు కోవాలి. లేనట్లయితే భారతదేశం మరల విభజనకు లోనయ్యే ప్రమాదం పొంచివున్నది. తమ స్వదేశంలోనే హిందువులు ద్వితీయ శ్రేణి పౌరులుగా బ్రతకవలసిన పరిస్థితి రాకుండ కాపాడుకోవలసి యున్నది.



# నవభారతి మీకందించిన పుస్తకరత్నాలు

| | | రూ॥లు |
|---|---|---|
| 1. | స్వాతంత్ర్య వీరసావర్కార్ | 8-00 |
| 2. | చదువుల చెట్టు | 10-00 |
| 3. | భారతీయ కరణ | 10-00 |
| 4. | మనదృక్కోణం | 10-00 |
| 5. | భీష్మయుధిష్ఠిర సంవాదం | 10-00 |
| 6. | హిందూ విజయ దుందుభి | 12-00 |
| 7. | ఉజ్జయినీ పతనం | 13-00 |
| 8. | మార్క్సిజమా? మానవతా వాదమా? | 13-00 |
| 9. | వందేమాతరం | 13-00 |
| 10. | ఇస్లాం సామ్రాజ్యవాదం | 15-00 |
| 11. | కర్మయోగి దీనదయాళ్ ఉపాధ్యాయ | 15-00 |
| 12. | మహారాణా బాప్పా | 16-00 |
| 13. | ఉత్తిష్ఠత! జాగ్రత! | 16-00 |
| 14. | హైద్రాబాద్ అజ్ఞాత చరిత్రపుటలు | 16-00 |
| 15. | సామ్రాట్ పుష్యమిత్ర | 17-00 |
| 16. | స్వాతంత్ర్య సమరజ్వాలలు | 20-00 |
| 17. | చంద్రశేఖర ఆజాద్ | 20-00 |
| 18. | 1857 స్వరాజ్య సంగ్రామం | 20-00 |
| 19. | తెగని సంకెళ్ళు | 20-00 |
| 20. | అల్లూరి సీతారామరాజు | 22-00 |
| 21. | కాళరాత్రి | 30-00 |
| 22. | జై సోమనాథ్ | 30-00 |
| 23. | యుగద్రష్ట డా॥ హెడ్గేవార్ | 60-00 |
| 24. | పాంచజన్యం | 60-00 |
| 25. | End of A Scientific utopia | 80-00 |
| 26. | Our Tomorrow | 95-00 |